## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

నవశిక్షిత సాహిత్యమాల

# తోటల పెంపకం


రచన

ఎ. రాఘవయ్య

చిత్రాలు

సంతోష్ గుప్త





నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ముఖచిత్రం : సంతోష్ గుప్త

ఈ పుస్తకం రాష్ట్ర వయోజన విద్యా వనరుల కేంద్రం హైదరాబాదు. ఆంధ్రప్రదేశ్ మరియు నేషనల్ బుక్ ట్రస్ట్. ఇండియా సంయుక్తంగా నిర్వహించిన వర్క్‌షాప్‌లో తయారుచేయబడినది.

ISBN 81-237-3157-4

ప్రథమ ముద్రణ 2000 (శక 1922)



THOTALA PEMPAKAM (*Telugu Original*)

రూ. 8.00

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్క్, న్యూఢిల్లీ-100016 ద్వారా ప్రచురింపబడినది.

# తోటల పెంపకం

కొందరికి ఇంటి ముందు ఖాళీస్థలం ఉంటుంది. అందులో రకరకాల మొక్కలు పెంచుతారు. ఇలా పెంచే చిన్న తోటలు అందం ఇస్తాయి. ఆదాయం పెంచుకోటానికి సహాయపడతాయి.

తోటలు పెంపకంలో మంచి ఆదాయం పొందే అవకాశం ఉంది. తోటల పెంపకానికి అనుకూలమైన నేల కావాలి. నీటి వసతి ఉండాలి. అనేక జాగ్రతలు తీసుకోవాలి. ఎరువులు వేయాలి. మొక్కలకు వచ్చే రోగాలు తెలుసుకోవాలి. వాడవలసిన మందులు వాడాలి.

కూరగాయలు దుంపలు తోటల నుండి వస్తాయి. పండ్లు, సుగంధ ద్రవ్యాలు కూడా అంతే. కూరగాయలు అనేక రకాలు. అందులో కొన్ని సాగుచేయటం తెలుసుకుందాం.

## టమాట

టమాట శీతాకాలం పంట. దీనికి ఇసుక నేలలు, బంక నేలలు రెండూ అనుకూలమే. నీరు ఇంకే నేలలు అధిక

దిగుబడికి అనుకూలం.

నారు మడిలో మాగిన పశువుల ఎరువు వేయాలి. రోగాలు రాకుండా చూచుకోవాలి. తగుమాత్రం బోర్డో మిశ్రమంతో నేలను తడపాలి. ఇందు వలస రోగాలు రావు. నత్రజని, భాస్వరం, పొటాష్ ఎరువులు మంచి వి. ఇవి మొక్కలు నాటే సమయంలో వేయాలి. ఎప్పటి కప్పుడు కలుపు మొక్కలు నాటే సమయంలో వేయాలి. ఎప్పటికప్పుడు కలుపు మొక్కలు పీకి వేయాలి. తెగుళ్ళు రాకుండా మందులు వాడాలి. తెలిసిన వారినుండి సల హాలు పొందాలి.

**టమాటలలో** 75 నుండి 80 రోజుల్లో పంటకు వచ్చే రకం ఉంది. హెక్టారుకు రెండు వందల క్వింటాళ్ల దిగుబడి వస్తుంది. పి.కె.యం-1 పంట ఉంది. దీని కాల పరిమితి 135 రోజులు. దీని దిగుబడి హెక్టారుకు 32 టన్నులు.

ఎకరా సాగుకు ఖర్చు ఎనిమిది వేల రూపాయలు అవుతుంది. ఆదాయం ఇరవై వేల రూపాయలు ఉంటుంది.

వంకాయ

భాగ్యమతి రకం వంగ చెట్టు కొమ్మలు, రెమ్మలు కలిగి ఉంటుంది. గుత్తులతో అధికంగా కాస్తుంది. భాగ్యమతి రకం వంకాయను కాయ తొలుచు పురుగు ఆశించదు.

దీనికి వెర్రి తెగులు తక్కవగా సోకుతుంది. వంకాయలో గుండ్రం రకం ఉంది. దీనిని 'పూసా' రౌండు అంటారు.

దీని నారు మడి 1x3 మీటర్లు ఉంటుంది. నాలుగు మడుల్లోని నారు ఎకరా పొలంకు సరిపోతుంది. నారు 30 లేక 35 రోజులకు నాటటానికి తయారవుతుంది. భాస్వరం, సత్రజని, పొటాష్ ఎరువులు వేయాలి. తగు సమయంలో తగినంతగా వేయాలి. చెట్టుకు రెండు కిలోలు పైగా కాయల దిగుబడి వస్తుంది.

పేను, ఆకు మచ్చ తెగులు, అక్షింతల పురుగు ఆశించకుండా చూడాలి. ఇందుకు 'కార్బరిల్' 50 శాతం మందు వాడాలి. కార్బరిల్ 2 గ్రాములు లీటరు నీటిలో కలిపి పిచికారి చేయాలి. మందులు వాడిన ఐదు రోజుల తరువాతనే కోత కోయాలి.

దీని సాగుకు ఎకరాకు ఎనిమిది వేల రూపాయలు కావాలి. ఐరవై వేల వరకు ఆదాయం ఉంటుంది.

## బెండ

దీని సాగుకు నేలను దున్నటం అవసరం. నాలుగు లేక ఐదు సార్లు దున్నాలి. వరసలలో మొక్కకు మొక్కకు మధ్య ఏడున్నర సెంటీ మీటర్లు ఎడంగా ఉండాలి. విత్తుటకు ముందు పశువుల ఎరువు వేయాలి. బాగా కలియ దున్నాలి.

నత్రజని, భాస్వరం, పొటాష్ ఎరువులు వెయ్యాలి. తక్కువ స్థలంలో అయితే నేలను తవ్వాలి. తరువాత తిరగేసుకోవాలి.

కలుపు పెరగకుండా చూడాలి. విత్తిన నలభై రోజులకు కాయలు కోతకు వస్తాతాయి. తరువాత కోతలు మూడు లేక నాలుగు రోజులకు వస్తాయి.

కాయ తొలుచు పురుగులకు 'కార్బరిల్' వాడాలి. దీనిని నీటిలో కలిపి పిచికారి చేయాలి.

బెండ సాగుకు వెచ్చని వాతావరణం అవసరం. ఇందులో మేలు రకం వంగడం 'పునాసవాని.' దీని వలన ఎక్కువ దిగుబడిని పొందగలరు.

బెండసాగుకు పెట్టుబడి పెద్దగా ఉండదు. ఎకరాకు ఆరువేల రూపాయలు చాలు. పదిహేను వేలు ఆదాయం రాగలదు.

## ఆకు గోబి (కాబేజి)

దీనిని పొలాలలోనే కాదు, ఇంటి ఆవరణంలో కూడా వేయవచ్చు. మొక్క కాండం చుట్టూ ఆకులు గుంపుగా పెరుగుతాయి. ఈ ఆకులు మొగ్గగా తయారవుతాయి. ఈ మొగ్గను ఆకుగోబి అంటారు. కాబేజి అని కూడ అంటారు.

ఇది శీతాకాలం పంట. దీనికి చల్ల దనం, తేమ కావాలి. ఒండ్రు, బంక మన్ను నేలలు మంచివి.

ముందు గింజలు చల్లాలి. నారు మొక్కలు నాటటానికి అనుకూలంగా పెరుగుతాయి. ఇందుకు నాలుగు వారాలనుండి ఆరు వారాలు పడుతుంది. నారు మొక్కలను వరుసలలో నాటాలి.

పశువుల పేడ ఎరువుగా వేయాలి. అమోనియం సల్ఫేట్, సూపర్ ఫాస్ఫేట్ ఎరువులు వేయాలి. రకరకాల రోగాలు రావచ్చు. ఇందుకు రకరకాల మందులు వాడతారు.

ఆకు గోబిలో విటమినులు బాగా ఉంటాయి. దీని సాగుకు పెట్టుబడి ఐదు నుండి ఆరు వేల రూపాయలు కావాలి. ఆదాయం పదిహేను వేలు రాగలదు. ఒక్కోసారి ఇంకా ఎక్కువ రావచ్చు.

## పువ్వు గోబి (కాలీ ఫ్లవర్)

దీనిలో పోషక పదార్థాలు ఎక్కువగా ఉంటాయి. ఆకు గోబికి తీసుకునే జాగ్రతలు దీని సాగుకు కూడా తీసుకోవాలి.

నాలుగు లేక ఆదు వారాలలో నారు తయారవుతుంది. నారునునాటే ముందు నేల పొడిగా వుంటే తడి పెట్టాలి. నాటిన తరవాత నత్రజని ఎరువు వేయాలి. ముదిరిన నారును వాడకూడదు.

దీని దిగుబడి బాగా ఉంటుంది. సాగుఖర్చు మామూలుగా ఆరు వేల వరకు ఉంటుంది. ఆదాయం

పదిహేను వేలు వచ్చే అవకాశం ఉంది.

## దుంపలు

దుంపకూరల సాగు వలన కూడా ఆదాయం పొందవచ్చు. ఆలుగడ్డ, చామ గడ్డదలను ఎక్కువగా వాడతారు. వాటి సాగు గురించి తెలుసు కుందాం.

**ఆలుగడ్డ (బంగాళా దుంప)**

ఆలుగడ్డలు నూరు నుండి నూట ఇరవై రోజులలో కోతకు వస్తాయి. వీటికి చల్లని వాతావరణం కావాలి. ఈ పంట వేసిన నేలలో నీరు నిలువ రాదు. దీనిని కొన్ని ప్రాంతాల్లో రబి పంటగా పండిస్తున్నారు.

తెగులు లేని దుంపలను విత్తనంగా వాడాలి. బోదెకు 15 లేక 20 సెంటి మీటర్ల ఎడంగా దుంపలు నాటాలి. నత్రజని, భాస్వరం పొటాష్ ఎరువులు వేయాలి. సమయం చూచుకుని ఏది వేయాలో ఆలోచించాలి.

దీని ఆకులు లేత పసుపు రంగులో ఉంటాయి. ఈ ఆకులు గోధుమ రంగులోనికి మారతాయి. అప్పుడు దుంపలు త్రవ్వటానికి తయారయినాయని గుర్తించాలి.

ఆలుగడ్డ మొక్కలకు దుంప పురుగు, లదెపురుగులు,



రసం పీల్చు పురుగులు నష్టం కలిగిస్తాయి. అక్షింతల పురుగులు కూడ ఆశింపవచ్చు. నివారణకు పొలిథియాన్, ఎండో సల్ఫాన్, మలాథయాన్, సెవిన్ మందులు వాడాలి. ఈ పురుగు మందులు నీటితో కలిపి పిచికారి చేయాలి.

పాతిక వేల పెట్టుబడి ఎకరంలో అలుగడ్డ సాగు చేయటానికి కావాలి. యాభై వేల రూపాయల ఆదాయం పొందవచ్చు.

## చామగడ్డ

చామగడ్డ నాటటానికి నేలను దున్నాలి. మూడు నాలుగు

సార్లు దున్నాలి. ఆఖరు దుక్కిలో పశువుల ఎరువు వేయాలి. దీనిని వరుసలలో నాటాలి. వరుసల మధ్య 60 సెంటీ మీటర్ల ఎడం ఉండాలి. చామగడ్డను చామదుంప అని కూడా అంటారు.

హెక్టారుకు దాదాపు వేయి కిలోల విత్తనపు గడ్డలు అవసరం. ప్రతి గడ్డ బరువు 40 లేక 50 గ్రాములు దాకా ఉంటాలి. నాటటానికి ముందు తెగుళ్ళు రాకుండా 'అగలాల్' మందులో శుభ్రం చేయాలి. ఈ మందు 10 లీటర్ల నీటిలో కలపాలి. అందులో దుంప ముంచితే అవుతుంది.

చామగడ్డ ఆకుపై జింకు లోపం రావచ్చు. దీని నివారణకు జింకు సల్ఫేట్ ద్రావణం పిచికారి చేయటం మంచిది.

శతముఖి రకం చామగడ్డ మేలైనది. దీనిని బావుల క్రింద తోటలలో పండిస్తారు. పెరటిలో కూడా వేసుకోవచ్చు. దీని పంటకాలం 150 నుండి 180 రోజులు. ముందు ఆకులు పసుపు రంగులోనికి మారతాయి. ఆకులు ఎండిన తరువాత చామగడ్డ త్రవ్వి తీయాలి. దిగిబడి హెక్టారుకు 20 టన్నుల వరుకు ఉంటుంది. అంటేఎకరాకు దిగుబడి 8 టన్నులు వస్తుంది.

దీని సాగుకు ఎకరాకు ఖర్చు 16 వేల వరకు ఉంటుంది. ఆదాయం సుమారు 30 వేల రూపాయలు ఉంటుంది.

# పండ్లు

పండ్లు తినటం ఆరోగ్యానికి మంచిది. ఇవి శరీరానికి మేలు చేస్తాయి. రక్తాన్ని పెంచుతాయి. వాటిలో విటమినులు దండిగా ఉంటాయి. కొన్ని పండ్ల తోటలను గురించి తెలుసుకుందాం.

## మామిడి

ఇది మన జాతీయ ఫలం. పండ్లలో దీనిది మొదటి స్థానం. అన్ని వ్యవసాయ భూముల్లోను మామిడి తోటలు పెంచవచ్చు. మనం వాడే రకాలలో బంగనపల్లి, నీలం, మల్గోబా, జహంగీర్ ఉన్నాయి. జలాల్, సువర్ణరేఖ రకాలను ఊరగాయకు వాడతారు. మామిడి రసాలలో చిన్న రసం, పెద్ద రసం, చెఱకు రసం పండ్లు వాడతారు.

దీని సాగుకు భూమి తగినంత లోతుగా దున్నాలి. 1x1x1 గుంతలు తవ్వాలి. మామిడి మొక్కలు వరుసలో నాటాలి. 8 లేక 10 మీ. దూరంగా అంట్లు నాటాలి. పశువుల ఎరువు, సూపర్ ఫాస్ఫేట్, బి.హెచ్.సి పొడరు 10 శాతం గుంతల్లో నింపాలి. అంటు మొక్కను చిన్న కొయ్యకు కలదకుండా కట్టాలి. మొక్క వయసునుబట్టి

నత్రజని, భాస్వరం, పొటాష్ వేయాలి. మామిడి పంటకు రావటానికి ఐదు సంవత్సరాలు పడుతుంది. పూర్తి పంట రావటానికి 10 నుండి 14 సంవత్సరాలు పడుతుంది.

దీనిని ఇంటి ఖాళీస్థలంలో వేయవచ్చు. వెడల్పయిన పొలాల గట్లు మీద వేసినా ఆదాయం వస్తుంది.

మామిడి చెట్లను పెంచటానికి ఎక్కువ ఖర్చు చేయాలి. మొత్తం మీద ఎకరాకు ఖర్చు ముప్పయి వేల రూపాయలు ఉంటుంది. కాపుకు వచ్చే వరకు మామిడి తోటల్లో ఇతర పంటలు వేయ వచ్చును. ఇలా వేసిన పంటలను అంతర పంటలు అంటారు. అంతర పంటల మీదవచ్చే



ఆదాయంతో మామిడి తోటలకు సాలీనా కావలసిన ఖర్చు భరించవచ్చు. పూర్తిగా కాపుకువచ్చిన తరువాత ఎకరాకు 5000 రూపాయలు ఖర్చు ఉంటుంది. సంవత్సరానికి ఆదాయం రూ.15 వేలు వరకు రాగలదు.

## నారింజ, నిమ్మ

నిమ్మ, నారింజ, బత్తాయిలు, కమలా ఫలాల సాగులో పెద్ద తేడా ఉండదు. చీనీ, సాత్కూడి, అరంజి, మొసాంబి, బత్తాయి, నారింజ రకాలకు చెందినవి. నిమ్మలో పులుసు నిమ్మ, సన్న నిమ్మ, కాగ్జి నిమ్మ, సాదా నిమ్మ రకాలు ఉన్నాయి.

వీటి చెట్ల మధ్య దూరం ఆరు మీటర్లు ఉండాలి. ఎకరాకు 106 చెట్లు నాటవచ్చు. నాటేముందు. గుంతలు త్రవ్వాలి. ప్రతి గుంటకు తట్ట పశువుల ఎరువు కావాలి. కిలో సూపర్ ఫాస్ఫేట్ కావాలి. ఈ రెండూ మట్టిలో కలిపి గుంటలు నింపాలి. ఒకటి రెండు వారాల తరువాత మొక్కలు నాటాలి. చెట్ల మధ్య మూడు సంవత్సరాల వరకు అంతర పంటలు వేయవచ్చు. వేరుశనగ, అలసంద, పెసలు, పిల్లి పెసర, జనుము ఉలవ వేసుకోవచ్చు. ఈ విధంగా ఖర్చు కలిసివస్తుంది.

చెట్లకు తెగుళ్ళు, రోగాలు రాకుండా చూడాలి. మంగు

తెగులు, తెల్ల పురుగు ఆకులకు సోకవచ్చు. నివారణకు 'వెట్టబుల్ సల్ఫర్' బాగా పనిచేస్తుంది. దీనిని రెండు గ్రాములు లీటరు నీళ్లలో కలిపి మూడు సార్లు స్ప్రే చేయాలి. ఆకు మడతకు 'మోనోక్రోటో పాస్ 40 ఇ.సి.' మందును నీటిలో కలిపి పిచికారి చేయాలి. తెగుళ్లు, వాడవలసిన మందులు గురించి తెలిసిన వారి నుండి సలహాలు పొందుతూ ఉండాలి.

కాపుకు వచ్చే వరకు ఎకరాలో ఖర్చు 30 వేల రూపాయలు ఉంటుంది. అదాయం మొదటి కాపుకు పది వేల రూపాయలు ఉంటుంది. కాపు కాపుకు ఆదాయం పెరుగుతుంది. 50 వేల రూపాయల వరకు ఆదాయం పెరిగే అవకాశం ఉంది.

## జామ

జామ సాగుకు అన్ని రకాల నేలలు అనుకూలమే! ఒండ్రు నేలు ఎక్కువ అనుకూలంగా ఉంటాయి.

అంట్లు నాటటం వలన దీని వ్యాప్తి జరుగుతుంది. జామ చెట్లు చాలా ఇళ్ళలో పెంచుతారు.

జామ అంట్లు నాటటానికి జూన్, జూలై, అక్టోబరు, నవంబరు మాసాలు అనుకూలంగా ఉంటాయి. మొక్కల వయసును బట్టి ఎరువులు వాడాలి. సంవత్సరం వయసు

మొక్కకు పశువుల ఎరువు 15 కిలోలు వేయాలి. నాలుగు సంవత్సరాల వయసుకు 60 కిలోలు వేయాలి. అమో నియం సల్ఫేట్ ఒక కిలో, మ్యూరేట్ ఆఫ్ పొటాష్ అర కిలో, సూపర్ పాస్ఫేట్ ఒక కిలో వేయాలి.

పండిన కాయలకు ఈగల బెడద ఎక్కువ. వానాకాలం మరీ ఎక్కువ. పురుగు తినిన పండ్లను ఏరి తగల బెట్టా లి. పొలుసు పురుగు సోకవచ్చు. నివారణకు ఫిష్ ఆయి ల్, రోసిన్ సబ్బు కలిపిన మిశ్రమం వాడాలి. ఏడున్నర కిలోల మిశ్రమం నాలుగయిదు లీటర్ల నీటిలో కలిపి పిచి కారి చేయాలి. ఇలా వారానికి ఒకసారి, మూడు సార్లు చేయాలి. చెట్ల కొమ్మలు ఎండి చనిపోవచ్చు. ఇటువం టి కొమ్మలు కత్తిరించి కాల్చాలి.

జామలో లక్నో-49, సఫేదా, తెల్ల జామ రకాలు మేలై నవి.

మూడు సంవత్సరాల వరకు ఎకరాకు సాగుఖర్చు 4 వేల రూపాయలు. ఆధాయం 5 వేలు. తదుపరి 5 సంవ త్సరాల వరకు ఖర్చు 6 వేల రూపాయలు అవుతుంది. ఆదాయం 12 వేలు వస్తుంది. ఐదు సంవత్సరాల తరు వాత ఎకరాకు సాలీనా సాగు ఖర్చు 7 వేలు. ఆదాయం 20 వేల రూపాయలు పొందవచ్చు.

## సపోటా

పాల సపోటా ప్రసిద్ధి గాంచినది. ఇది గుడ్డు ఆకారంలో ఉంటుంది. క్రికెట్ బాల్, ద్వార పూడి రకాలు పెద్దగా ఉంటాయి.

సపోటాకు ఒండ్రు మట్టి నేల మంచిది. మధ్య తరహా భూములు కూడ అనుకూలమైనవి. అంట్లు నాటి దీనిని సాగు చేస్తారు. వర్షాలు కురిసే చోట వర్షాలు ఆగిపోగానే ఎరువులు వేయాలి. సంవత్సరం వయసు మొక్కకు 50 పౌండ్ల పశువుల ఎరువు వేయాలి. ఒక పౌండు అముదం పిండి కూడా వేయాలి.

నాటిన రెండు మూడు సంవత్సరాలకు సపోటా చెట్టు కాపుకు వస్తుంది. ఏడవ సంవత్సరం నుండి మంచి దిగుబడి ఉంటుంది. దిగుబడి చెట్టుకు రెండు వేల నుండి మూడు వేలు పండ్లు రాగలవు.

దీనికి ఆకు నల్లి, పిండి నల్లి, చీడలు రావచ్చు. ఇందుకు 40 శాతం నికోటిన్ సల్ఫేట్ నీటిలో కరిగే డి.డి.టి.ని కలిపి పిచికారి చేస్తే మంచిది. కాండం తొలిచే పురుగు ఆశించవచ్చు. తొలిచిన రంధ్రాలలో కిరోసిన్ వేసి మూసి వేయాలి. పెట్రోల్ వేసి కూడ మూసివేయవచ్చు. సపోటా తోటలో కాయ గూరలు వేయవచ్చు. పప్పు ధ్యాన్యాలు పండించవచ్చు. ఈ విధంగా కూడా సాగుదారులు

ఆదాయం పొందుతారు. దీని ఆదాయం సంవత్సరాలు గడిచిన కొలదీ మారుతుంది. మొదటి సంవత్సరానికి ఎకరాకు 5 వేలు. ఏడు సంవత్సరాల తరువాత 15 వేల నుండి 18 వేల రూపాయలు సంవత్సర ఆదాయం పొందే అవకాశం ఉంది.

**అరటి**

అరటి సాగుకు తగినంత నీరు కావాలి. ఒండ్రు మట్టి నేలలు కావాలి. అరటి పండ్లు అనేక రకాలు ఉన్నాయి.

కర్పూర చక్రకేళి, అమృతపాణి, తెల్ల చక్రకేళి, పాటి పచ్చ అరటి బూడిద బొంత పేర్కొన దగినవి.

కర్పూర చక్రకేళి, పెద్ద పచ్చ అరటి 12 నుండి 13 మాసాలలో పంటకు వస్తాయి. అమృతపాణి 14 నుండి 15 నెలలో పంటకు రావచ్చు. తెల్ల చక్రకేళి 14 నుండి 14 నెలల్లో పంటకు వస్తుంది. కూర రకాలు ఏనుగు బొంత, బూడిద బొంత కూడ 13 లేక 14 నెలల్లో పంటకు వస్తాయి. అరటి గెలలతో పాటు, ఆకుల అమ్మకం వలన ఆదాయం వస్తుంది.

కర్పూర చక్రకేళి పెద్దదిగా ఉంటుంది. 10 నుండి 15 కిలోల బరువుంటుంది. తెల్ల చక్రకేళి గెల 6 నుండి 10 కిలోలు ఉంటుంది. పెద్ద పచ్చ అరటి గెల బరువు

15 నుండి 20 కిలోలు ఉంటుంది.

మొదట రెండు - మూడు నెలల వయసు గల పిల కను నాటాలి. ముందు 18 లీటర్ల నీటిలో బి. హెచ్.సి 50 శాతం మందును కలిపిన ద్రవంలో పిలకలను ముంచాలి. అలా ముంచిన తరువాత వాటిని నాటాలి. పొడుగు రకాలను రెండు మీటర్లు ఎడంగా నాటాలి. కురచ రకాలను 1.7 మీటర్లు ఎడంగా నాటాలి. కురచ రకాలను 1.7 మీటర్లు ఎడంగా నాటాలి.

అరటికి మొక్కపురుగు, గొంగళి పురగు, రెక్కల నల్లి బెడదరావచ్చు. నివారణకు 'డైయితోమేట్:' 'మలాథియాన్'



50 శాతం మందులు వాడాలి. ఈ మందులు నీటితో కలిపి పిచికారి చేయాలి. అప్పుడప్పుడు నిపుణుల సల హాలు తీసుకుంటే మంచిది.

అరటి సాగుకు ఎకరాకు పది హైను వేల రూపాయలు పెట్టుబడి పెట్టాలి. ముప్పయి వేలు అదాయం ఉంటుంది.

## బొప్పాయి

మన దేశంలో అంతటా బొప్పాయి సాగు చేస్తారు. బొప్పా యిలో మంచి విటమిన్లు ఉంటాయి. కడుపు సంబంధమైన అనేక రోగాలను బొప్పాయి పోగొడుతుంది. అనేక మందుల్లో దీనిని వాడతారు.

బొప్పాయిలో మధుబిందు, వాషింగ్టన్, పెరడెనియా, సోలో రకాలు ఉన్నాయి. ఇంకా అనేక రకాలు ఉన్నాయి.

ముందుగా నారు పోస్తారు. కొత్తగా తీసిన విత్తనాలు బాగా మొలకెత్తుతాయి. 15 లేక 20 రోజులలో ఇవి మొలకెత్తుతాయి. ఎకరాకు 100 నుంచి 120 గ్రాముల విత్తనాలు సరిపోతాయి. విత్తనాలను సెరపాస్, అగ్రోసా స్, థైరామ్‌లలో కలిపితే తెగుళ్ళు రావు.

ఎటు చూసినా 45 సెంటీమీటర్ల గుంతలు తీసి మొక్క లను నాటాలి. మొక్కలను సాయంత్రం పూట నాటటం మంచిది. ఇందు వలన మొక్కలు బాగా నిలదొటా

క్కకుంటాయి. ప్రతి 10 లేక 20 ఆడ మొక్కలకు ఒక మగ మొక్కను నాటాలి. 10 నుండి 15 మాసాలలో కాపు వస్తుంది. మూడు సంవత్సరాల తరువాత తిరిగి నాటవచ్చు. ఒక చెట్టు 3 సంవత్సరాలలో 75 నుండి 150 పండ్లు ఇస్తుంది.

ఎదిగిన ఆరు నెలలకు ఒకసారి ప్రతి చెట్టుకు పశువుల ఎరువు 40 నుండి 50 కిలోలు వేయాలి. అరకిలో సల్ఫేట్ అఫ్ పొటాష్‌ను కూడా వేయాలి. తరువాత నీరు పెట్టాలి.

బొప్పాయి. మొక్కలను నాటిన తరువాత ఖాళీ స్థలం ఉంటుంది. కాళీ స్తలంలో కూరగాయలు వేయవచ్చు. ఈ విధంగా కూడా ఆదాయం పొందవచ్చు.

చెట్టు కాండంలో కుళ్లు రోగం రావచ్చు. చెట్టు మొదట నీరు నిలవకుండా చూడాలి. తెగులు తగిలిన చెట్లను తీసి వేసి కాల్చాలి. ఆకుముచ్చుకు డైథియో కార్బమేట్ పిచికారి చేయాలి. ఆకు ముడత నివాణకు 0.1 శాతం మలాథియాన్ పిచికారి చేయాలి. మెటాసిస్టాక్స్ కూడా పిచికారి చేయవచ్చు. పక్షి కన్ను తెగులు నివారణకు బ్లైటాక్స్ 0.2 మిశ్రమం పిచికారి చేయాలి. ఎర్ర లక్క పురుగు సోకితే 0.1 శాతం కెల్ థేన్ పిచికారి చేయవచ్చు. ఇది కాక అకార్ 338 లేక అకారిసైడ్ గాని పిచికారి చేయాలి.

బొప్పాయి సాగుకు ఖర్చు మొదటి సంవత్సరమే ఎక్కువ తరువాత తక్కువ. పదివేల రూపాయలు ఖర్చు దాటుతుంది. బొప్పాయి కాయల నుండి పాలు తీస్తే ఆదాయం పెరుగుతుంది. మిశ్రమ పంటలు వేసి కూడా లాభం పొందుతారు. 3 సంవత్సరాలలో ఖర్చులు పోగా ఒక లక్ష రూపాయలు లాభం వస్తుంది.

## ద్రాక్ష

ద్రాక్షను పందిళ్ళపై, తీగలపై పెంచుతారు. ద్రాక్షలో అనేక రకాలు ఉన్నాయి. అనాబ్‌షాహి రకం విపరీతంగా కాస్తుంది. అర్కవతి, అర్కకంచన్, అర్కశ్యాం రకాలు కూడ ఉన్నాయి. వీటి తీగ బాగా పెరుగుతుంది. పండ్లు గుత్తులుగా కాస్తాయి.

అర్కవతి రకం గుత్తికి 500 గ్రా. పండ్లు కాస్తాయి. అర్కకంచన్ రకం పండ్లు గెల 700 గ్రా. బరువు తూగుతుంది. దీని పండ్లు పెద్దవిగా కోలగా ఉంటాయి. బంగారం రంగులో ఉంటాయి.

అర్కహంస రకం మరొకటి ఉంది. దీనిలో పంచదార శాతం ఎక్కువ.

ఎకరాకు పెట్టుబడి 20 వేల రూపాయలు అవసరం. ఆదాయం 40 వేలు ఉంటుంది.

# సుగంధ ద్రవ్యాలు - ఇతరాలు

ఉల్లిగడ్డలు, అల్లం, పసులు పంటలు వేసి ఆదాయం పొందుతున్నారు. ధనియాలు, మెంతులు, జీలకర్ర, వాము కూడ సాగుచేస్తున్నారు. వీటి సాగు గురించి తెలుసుకుందాం.

## ఉల్లిగడ్డలు

వీటిలో బళ్ళారి, పెద్దపల్లి, రాయదుర్గ, బాంబేవైట్, వాసిక్రోడ్, యాదగిరి రకాలు మంచివి.

నీరు నిలవని సారవంతమైన నేలలు ఉల్లికి అనుకూలంగా ఉంటాయి. నేరుగా ఉల్లిగడ్డలు నాటుతారు, పెంచిన నారు మెక్కలను కూడ నాటుతారు. జనవరి ఆఖరు లేక ఫ్రబవరి మొదటి వారంలో నాటుకోవాలి. మే నెలలో పంట తీస్తారు. నాలుగు నెలల్లో పంట త్రవ్వకానికి వస్తుంది.

మే, సెప్టెంబర్, నవంబర్ నెలల్లో కూడ నాటుతూ ఉంటారు. ఉల్లిగడ్డలు దాదాపు అందరూ వాడతారు. వీటికి ఎప్పుడూ గిరాకీ ఉంటుంది. ఉల్లికి ఆకుపచ్చ తెగులు రావచ్చు. నివారణకు డైతేస్ - యం - 45 మందు వాడాలి. ఈ మందు 2.5 గ్రాం ఒక లీటరు నీటిలో కలిపి పిచికారి చేయాలి. నారు కుళ్ళు తెగులు రాకుండా వెట్ట

బుల్ సెరిసాల్ మందు వాడాలి. ఈ మందు లీటరు నీటికి ఒక గ్రాము కలిపి పిచికారి చేయాలి.

సాగు ఖర్చు కరానికి 12 వేల రూపాయలు, ఆదాయము 25 వేలు పొంద వచ్చు.

**అల్లం**

అల్లంలో సిద్ధిపేట, తుని, నర్సీపట్నం, 'రయోడి జెనిరో' రకాలు ఉన్నాయి. అల్లం నుండి శొంటి తయారు చేస్తారు. మురుగు నీరు నిలవని నేలలు దీనికి అనుకూలము.

1.2 మీ 1.8 మీ గల మళ్ళను తయారు చేయాలి. నీటిని పెట్టటానికి బోదెలు ఏర్పాటు చేయాలి. బోదెలు 20 నుండి 25 సెంటీ మీటర్లులోతు ఉండాలి.

మొలకెత్తిన దుంపలను 10-15 గ్రా. బరువుండునట్లులు ముక్కలుగా చేసి విత్తనంగా ఉపయోగించాలి. ముందుగా దుంపలను 0.25 శాతం వెట్టబుల్ సెరసాస్ మందు ద్రావణంలో అరగంట ఉంచాలి. తరువాత విత్తనంగా నాటాలి. అల్లం పైరు వేసిన పొలం చుట్టూ గట్ల మీద ఆముదం విత్తనాలు విత్తాలి. ఇందు వలన పంటకు కావలసిన నీడ దొరుకుతుంది.

నేల, వాతావరణం బట్టి నీరు కట్టాలి. ఏప్రిల్ ఆఖరు నుంచి మే రెండవ వారం లోపల నాటటం మంచిది.

అలస్యం అయితే దిగిబడు తగ్గుతుంది.

దుంప కుళ్లు, ఈగ రాకుండా మురుగు నీరు పోయే వసతి అవసరము.

పెట్టుబడి ఎకరాకు 10 వేల రూపాయలకు పైగా కావాలి. అదాయం 20 వేలకు పైగా వస్తుంది.

## పసుపు

ఇది తొమ్మిది నేలల పంట. దీనికి గరప నేలలు మంచివి. పసుపు మొక్కలను మే, జూన్, జూలై నెలల్లో నాటుతారు. దుంపలు ఊరునప్పుడు ఎక్కువ తడులు అవసరం.

ఇందులో కస్తూరి రకం మే, నెల రెండవ పక్షంలో నాటాలి. కేసరి రకాన్ని జూన్ నెల మొదటి పక్షంలో నాటాలి. పసుపులో మైదుకూరు, టేకూరి పేట, దుగ్గిరాల, అర్మూర్, కేసరి, కస్తూరి రకాలు ఉన్నవి.

మొవ్వు కుళ్లు, దుంపకుళ్లు రాకుండా విత్తనంగా వాడే పసుపు దుంపలను అగలాల్ ద్రావణంలో నాన బెట్టాలి. తరువాత నీడలో ఆరబెట్టి ఆ పైన వాటాలి.

దీని సాగుకు ఎకరాకు 15 వేల రూపాయలు అవసరం. ఆదాయం 25 వేల వరకు వస్తుంది.

## దనియాలు

ధనియాలను అక్టోబర్ 15 నుండి నవంబర్ 15 వరకు విత్తవచ్చు. 110 రోజుల్లో పంట చేతికి వస్తుంది. యం. యస్-1 : సి. యస్-4 రకాలు 100 నుండి 110 రోజుల్లో పంటకు వస్తాయి. సి. యస్-6 రకం 80 నుండి 85 రోజుల్లో పంటకు రాగలదు.

నేలను కొర్రుతో చదును చేసి విత్తనం ఎద పెట్టాలి. ధనియాలను కందితో మిశ్రమ పంటగా వేయవచ్చు. దిగుబడి సి.యస్-4 రకం ధనియాలు హెక్టారుకు 1700 కి. గ్రా. వరకు రాగలదు. మిగతా రకాల దిగిబడి 900 నుండి 1260 కి.గ్రా. వరకు ఉంటుంది.

30 నుండి 45 రోజుల్లో ఒకసారి కలుపు తీయ్యాలి. నత్రజని, భాస్వరం పొటాష్ ఇచ్చే ఎరువులను వేయాలి. లద్దెపురుగును, పేను బంకను, ఎర్రనల్లిని అరికట్టే మందులు తెలుసుకోవాలి. అవసరాన్ని బట్టి పురుగు మందులు వాడాలి. బూడిద తెగులు రాకుండా 2.5 కిలోల గంధకపు పొడిని వాడాలి. పూత ఆరంభ దశలో ఒక సారి ఇలా చేయాలి. తరువాత 15 లేక 20 రోజులకు మరొక సారి గంధకపు పొడిని వాడాలి.

ధనియాల సాగుకు 4 వేల రూపాయలు పెట్టుబడి అవసరం. ఆదాయం 9 వేల వరకు ఉంటుంది.

## జీల కర్ర

దీనిని జీరా అని కూడా అంటారు. దీని విత్తనాలు సువాసనగా ఉంటాయి. విత్తనం గొర్రుతో ఎద పెట్టటాలి. మూడు, వాలుగు రోజుల్లో మొలక బయటకు రాగలదు. ఇది వర్షాధారం పంట. దొడ్డు రకం విత్తనం మంచిది. సాగుకు నీరు నిలవని ఒండ్రు నేలలు కావాలి. చల్లని పొడి వాతావరణం అవసరం. పంట కాలం రకాలను బట్టి ఉంటుంది. 90 నుండి 110 రోజుల్లో పంట వస్తుంది. విత్తనం ఒక శాతం మోర్క్యురియల్ పంగిసైడ్‌తో శుద్ధి చేసి నాటాలి.

హెక్టారుకు 8 నుండి 10 క్వింటాళ్ళు దిగుబడి పొందవచ్చు. జీలకర్రకు ఎరువుల అవసరం పెద్దగా ఉండదు. అయినా పాస్ఫరస్ ఎరువు విత్తుటకు ముందువేయాలి.

బూడిద తెగులు, ఆకు మాడు తెగులు, ఎండ తెగులు రాకుండా చూడాలి. వీటి నివారణకు డెమక్రాస్, కలాక్సిస్, అగ్రోసాస్ మందులు; ఇంకా చాల మందులు ఉన్నాయి. ఎప్పుడు ఏది అవసరమో తెలుసుకొని వాడాలి. ఎకరాకు 7 నుండి 8 వేలు రూపాయలు పెట్టుబడి కావాలి. 15 వేల రూపాయల ఆదాయం పొందవచ్చు.

## మెంతులు

వీటిలో లాం సెలక్షన్ నెం.1 రకం ఉంది. ఇది అధిక

దిగుబడి యిస్తుంది. పంటకాలము 70 నుండి 80 రోజులు. విత్తనం గొర్రుతో ఎదపెట్టాలి. మూడు, నాలుగు రోజులకు మొలక బయటికి రాగలదు. ఇది వర్షాధారపు పంట. నల్ల రేగడి నేలకు నీరు పెట్టే అవసరం లేదు. వర్షాధారంగా పండించవచ్చు. హెక్టారుకు 700 కిలోలు దిగుబడి వస్తుంది.

ఆకులను తినే పురుగులను అరికట్టాలి. ఇందుకు 0.05 శాతం నువక్రాన్ పిచికారి చేయాలి. 0.07 ఎకలాక్స్ కూడా బాగా పని చేస్తుంది. ఏదో ఒక మందు 10 లేక 15 రోజులకొక సారి పిచికారి చేయాలి. బూడిద తెగులు వస్తే హెక్టారుకు 25 కిలోల గంధకపు పొడిని చల్లాలి.

ఎకరాకు 6 వేల రూపాయల పెట్టుబడి కావాలి. ఆదాయం సుమారు 15 వేలు పొందవచ్చు.

## వాము

వాములో లాం సెలక్షన్ నెం.1 రకం మేలైనది. ఇది 80 సెం.మీ. వరకు ఎత్తు పెరుగుతుంది. పంట కాలం 135 రోజులు. లాం సెలక్షన్ నెంబరు 2 రకం 70 సెం.మీ. దాదాపు ఎత్తు పెరుగుతుంది. పంట కాలం 160 రోజులు.

విత్తనం గొర్రుతో ఎక్కువ లోతున పడకుండా ఎదపెట్టాలి. ఇది వర్షాధారంపై పెరిగే పంట. నీరు పెట్టే

అవసరం ఉండదు. వాము నుండి మెంతాల్ ఔషధం తయారు చేస్తారు.

ఆకు తినే పురుగులను అరికట్టటానికి 0.05 శాతం నువక్రాన్ పిచికారి చేయాలి. బూడిద తెగులు వస్తే 0.5 శాతం సల్ఫెక్సు పిచికారి చేయాలి. 1 లేక 2 సార్లు పిచికారి చేస్తే సరిపోతుంది. హెక్టారుకు 15 కిలోల లెక్కన గంధకం పొడి చల్లినా సరిపోగలదు. ఇందు వలన దృగుబడి పెరిగే అవకాసం ఉంది.

వాము సాగుకు ఎకరానికి పెట్టుబడి 3 వేల రూపాయలు కావాలి. ఆదాయం 10 వేలల వరకు ఉంటుంది.

మనం కూరగాయలు, పండ్లు, సుగంధ ద్రావ్యాలు గురించి తెలుసుకున్నాం. వాటిలో ఏది అనుకూలమో దానిని సాగు చేసుకుని లాభాలు పొందవచ్చు. ఏదయినా ఒకరకం పంట సాగు ఖర్చులు కొందరు భరింపలేక పో వచ్చు. వారు ఎంపిక చేసుకున్న పంటను తక్కువ భూమిలో సాగుచేసుకోవాలి. సాగులో మెలుకువలు బాగా తెలుసుకోవాలి. జాగ్రత్తలు పాటించాలి. అప్పుడే రావలసిన ఆదాయం పూర్తిగా చేతికందుతుంది.

Lasertypeset at UNIQUE Graphics, 2/3 Old Rajinder Nagar, New Delhi - 60
and printed at Shagun Offset, Mohammadpur, New Delhi - 29